# వళి, ప్రాస సంగ్రహము

రచయిత :

సర్వతన్త్ర స్వతంత్ర
వేదాన్త దేశిక

**ఆ. నరసింహ శర్మ**

కాపీరైటు రచయితవి

1984 [వెల : రూ 5-50 పై

# -: మనవి :-

యతి, ప్రాసలకు అతివ్యాప్తి, యవ్యాప్తి మొదలగు దోషములు లేకుండ లక్షణంబు లేర్పఱచినాఁడను. సంగ్రహముగ రచించి సంపూర్ణ రూపంబులను జూపినాను. నాతి విస్తృతముగ నుదాహరణము లిచ్చినాను. సంపూర్ణముగను, సంక్షేపముగను వళి, ప్రాసల రూపంబులిందు దెలియనగును. వళిని మూఁడంశంబులుగ విభజించుటలోని యౌచిత్యము గమనింపఁదగినది. సవర్ణముల నిరూపించుటలో గౌరవదోషమున్నను సవర్ణపద సార్థక్యము గమనింపఁబడవలెనని, యా దోషమును సహించినాఁడను. తక్కుంగల గుణదోషములు సహృదయు లెఱుంగ నగును.

ఇది బాలురకు బోధను, విజ్ఞులకు నానందమును జేకూర్చుఁగాక.

లక్ష్యము లింకను విపులముగ నిచ్చుట; సాధారణ విషయములనుకూడ వివరించు యవసరము కావచ్చును. కాని ఛందస్సు, అలంకారములు వ్యుత్పన్నులు గ్రహింపనగునవి. వృద్ధి మొదలగు సంధులను వివరింపలేదు. అధికముగ నుదాహరణములును చూపలేదు. ఛందోభంగ దోషముకన్న యతిదోషమునకు ప్రత్యేక గణన కలదు. కాననే యతి, ప్రాసలను వేఱుగ నిరూపించడమైనది.

దీని వ్రాతప్రతిని వ్రాసి ఇచ్చినవారు విద్వాన్ సుబ్బారావుగారు నా సహోధ్యాయకులు వారికి నా ధన్యవాదములు. గుప్తదాత, ప్రచురణకై ధనసహాయంచేసి ఈశ్వరానుగ్రహపాత్రుడైనాడు. శుభములగుగాక.

శ్రీనివాస నగర్
వేపగుంట P.O.
విశాఖపట్నం
తే 28-8-1984

ఇట్లు,
అ. నరసింహాశర్మ.

## -: వళి, ప్రాస సంగ్రహము :-

శ్లో॥ యతిప్రాసౌ శచీంద్రౌతౌ వామ దక్షిణ నేత్రగౌ ।
జగత్కావ్యపదే హృద్యే స్థితౌ స్యాతాం శుభంకరౌ ॥

ఇంద్రుడు దక్షిణ నేత్రమునను, శచీదేవి వామనేత్రమునందును నుండి వారి సంస్తావము హృదయము నందగును. ఇందులకు,

'అథై తత్ వామేఽక్షిణి పురుషరూప మేషాస్య పత్నీ విరాట్ తయోరేష సంస్తావో య ఏషోఽన్తర హృదయ'

(బృహదారణ్యకము. 4-2-3-అను శృతి ప్రమాణము) కాన

వైశ్వానర తైజస రూపులై జాగ్రత్తునందును, కలలందును, ననుభూతి నందుదురు. ఇత్తురు. కావ్యజగత్తు నీ రెంటి సంయోగము వంటిది. (కల నిజము) పదమనగా స్థానము. పద్యపాదము. అదియే హృదయము. ఆ దంపతులే యతిప్రాస రూపులు. వారు శుభంకరులు కావలెనని యాశంస చేయబడినది. అందలి బ్రహ్మవిద్యా రహస్యము తద్విదుల కెఱుక. భావకులు విపుల విషయములను భావింతురుగాక. ఇది మంగళశ్లోకము.

శ్లో॥ తౌ స్కంద గణపతీ వందే
గురురూప ధరౌ నరౌ ।
యచ్ఛీల మాత్మ సంస్తావం
మరు సంస్థాపితౌ హృది ॥

ఇది గురువులగు రమణ గణపతుల నుతి. రమణ మహర్షి స్కంధాంశభవుడని ప్రతీతిననుసరించి అభేద పరిగణనతో నుతి చేయబడినది.

# వళి నిరూపణంబను మొదటి యంశము

## సూత్రము 1 :- అజంతంబగు పాదాద్యేక వర్ణంబునకు విరామ స్థానంబుల సవర్ణాక్షరములుంచుట వళి-

ఇందు గ్రహింపఁబడునది పాదాదివర్ణము. పాదము అజాదియైన దానికే సవర్ణన్యాసము. హలాదియైన నచ్చుతోఁగూడిన హల్లునకు సవర్ణంబుల నుంచవలెను. అనేకములగు హల్లులున్న నందొక్క హల్లును గ్రహించి యనుగతంబైన యచ్చుతోఁగూడ విరామస్థానమున సవర్ణంబుల నుంచవలెను. కావుననే యేకవర్ణంబునకని యనుట. అచ్చులకును, హల్లులకును, సవర్ణాక్షరన్యాసము జరుగవలెను. అనుక్తంబులైన వళి భాషయు, యతి, విశ్రమాది పర్యాయపదములును, లోకసిద్ధములు గాన గ్రహింపనగును. అనేక విరామంబులున్న పద్యపాదములందన్నింటను పాదాదియే గ్రహించి సవర్ణంబు నుంచవలెను. విరామస్థానమును పద్య లక్షణమువలనఁ దెలియునది.

యతియందు మూఁడంశములు గలవు మొదటిది పాదాద్యక్షరమును దెలియుట సంధి, సంయోగాదులందు గ్రహింపనగు నక్షర నిర్ణయమును దెలియుట. రెండవది పద్యపాదమున విరామస్థానమును దెలియుట. దీనిని పద్యలక్షణమువలనఁ దెలియఁదగునని చెప్పితిమి. ఇంక మూఁడవది యా స్థలమున నుంచవలసిన సవర్ణత్వమును దెలియుట. ఈ మూఁడింటి వివేకమే యతి నెఱుఁగుట. ఇట్టిది లక్షణ విరుద్ధంబైనచో దానిని యతి భ్రష్టమందురు

ఆద్యక్షర గ్రహణము, సవర్ణాక్షరములు దెలియఁదగినవై యున్నవి పాదాదియందు కేవల మచ్చుగాని, యొక హల్లుతో మాత్రమే కూడిన యచ్చుగానీయున్న, గ్రహణమున సందేహము లేదు. సంధ్యాదులం దెద్దాని గ్రహింపవలెనో ముందు తెలుపఁబడును. గ్రహణమునందే నియమములగునో సవర్ణన్యాసమునందు నా నియమములే యగును.

—: ప్రథమాంశము సంపూర్ణము :—

## గ్రహణ న్యాస నిబంధనంబను రెండవ యంశము

**సూత్రము 2 :- అచ్ఛంది యందుఁ బరస్వరంబు గ్రాహ్యంబు.**

పూర్వపరస్వరంబులు సంధించునప్పుడు పరస్వరంబు గ్రహింపనగు నని భావము.

ఉదాహరణము:- (1) భారతము-విరాటపర్వము - 5 ఆ-218 పద్యము.

పూ ర్ణాహుతి సేయఁడే మనల నందఱ నొక్కట మార్గణా (హుతిన్)గ్నికిన్

పూర్ణ + ఆహుతి = ఆ కారము గ్రహింపఁబడినది.

'అందఱ'లోని 'అ' యతి విన్యాసము.

ఉదాహరణము:- (2) భారతము-విరాటపర్వము - 5 ఆ-284 పద్యము.

అసమున దీఁదెఱుంగక మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం

ఇది విన్యాసమునందు సంధికి నుదాహరణము. శేషమూహ్యము.

**సూత్రము 3 :- సంధియందగు వృద్ధ్యక్షరంబును గ్రాహ్యము**

వృద్ధిసంధియందుఁ బరపదాద్యచ్చుగానీ, యాదేశమైన వృద్ధ్యక్షరముగానీ గ్రహింపనగును.

ఉదా:- పరాచ్చుగ్రహించుటకు:- భాస్కరరామా : సుందర : 443 పద్యము.

లో॥ కైక క్రాముని రాముని గనుము నీకి బుద్ధి కాకుండినన్.

ఉదా:- 1 వృద్ధ్యచ్చునకు గ్రహణము : భార : విరాట : 3 ఆ - 32 పద్యము (33)

భో॥ గైక పరాయణుల్ పురుషు లంగజుఁ దప్రతికార చేష్టిత

**సూత్రము 4 :- అదంత, సాంత. శబ్దములపై నతికి లోపించిన యత్తునకు గ్రహణంబు**

అదంతము లనఁగా నకారాంతములు. 'ను' చేరినట్టి 'రామన్'

మొదలగునవి. సాంతము లనఁగా 'తమస్' మొదలగు సాంత శబ్దములు. వీనికి నదంతమగు పదము పరమగునపుడు పరపదాదియైన 'అత్తు' లోపించును. ఎట్లనఁగా! విసర్గయున్న దానికి 'విసర్జనీయస్యసః' అని సకారాదేశము. 'రామః' అనునది 'రామస్' అగును. 'ససజుషోరుః' అను సూత్రముచే సకారమునకు రేఫాదేశము, 'రామర్' అగును. కాగా 'రామర్ + అహం' అని యగును. 'అతోరోరప్లుతా దప్లుతే' అను సూత్రముచే రేఫకు 'ఉ' ఆదేశము. రామ ఉ + అహం. 'రామ + ఉ' అనుచోట గుణసంధి రాఁగా 'రామో + అహం' 'ఏఙః పదాన్తాదతి' అను సూత్రముచేఁ బరపదాది అత్తునకు లోపము. అట్లు లోపించిన అకారమునకు గ్రహణము. ఇట్లే సాంతములకుతగును. 'తమోర్కః' అని.

ఉదాహరణము:- (అదంతమునకు) మరున్నందన శతకమునందు.

శా। హే పాటచ్చర రామదాస తవ దాసోహ మ్మరున్నందనా
దాసః + అహం అనునప్పటి అకారమునకు న్యాసము.

ఉదాహరణము:- (సాంతములకు) సుభద్రాపరిణయము 1-114

తే। జో సహస్యే శరజన్మగాంచి యల నీ హేర క్షమాభృత్కూమా
తేజః + అసహ్యే అను పదములోని అకారమునకు గ్రహణము

'అన్యోన్య' శబ్దము అదంతము గాన నిందుదహరింప నగును

అన్యసు + అన్యసు అని ప్రథమా విభక్తియందు సు చేరఁగా 'అసమాస వద్భావే పూర్వపదస్థస్య సుపోసుర్వక్తవ్యః - అను సూత్ర ముచే 'స్' రాఁగా 'అన్యస్ + అన్యః' యగును. ఉత్తరపదమే విభక్తి యందున్నను పూర్వపదము 'స్' అనునదియే యంతమందు గలది. యగును. కాఁగా 'అన్యోన్యస్య' మొదలగు రూపములు సిద్ధించును.

కాన నిది యదంతము. ఆ సకారము రామ శబ్దములందలి సకారమువలె వివర్తమై 'అన్యోన్య' అను రూపము లేర్పడినవి. ఇది నిత్య సమాసమగుటను నిట్టిమార్పు వచ్చినది. ఇందు సకారము లేదనుట సరికాదు.

ఉదా:- కావ్యాలంకార చూడామణి - 7 - 68.

అ న్యోన్య సుప్రష్టి తుష్టి కుశ లాదులం జెందిరి నాఁడు నాటికిన్

అన్యస్ + అన్య లోని పరపదాది అకారమునకు గ్రహణము.

అ న్యోన్య హితత్వ సంపదలనొందిరి. అనుచోట 'అన్యోన్య'యో అనుదానికి గ్రహణము గలదు. అట్లే హల్లును గ్రహింపఁబడుచున్నది. అ న్యోన్య సుఖానుకూలతల నోమిరి విప్రులు ఇది అఖండ వళిలో వివరింప బడును.

సూత్రము 5 :- య, హ. లును వట్రువ సుడులున్న హల్లులును స్వప్రాణ రూపకంబులు విభాషనగు.

య, హ, అను వ్యంజనము లేయచ్చులతోఁ గూడియున్నవో వాని రూపమే తమకు నగును. వానిచే నారోపితంబులై తమ వ్యంజనత్వమును విడిచి తమలోనున్న ప్రాణ రూపత్వముచేతను మాత్రమే గ్రహింపఁబడుచుండును. వానిపై నున్న యచ్చుల మైత్రియే యతియుండు కానగును ఒకచో హల్లులుగగూడ నగునని విభాషా శబ్దముచే గ్రహింపనగును. అట్లే వట్రువ సుడులున్న వ్యంజనములు నని భావము. వట్రువ సుడియున్న వ్యంజనము కేవలము వట్రువ సుడి వంటిదే కాన దానినే గ్రహించి ఋ కార మైత్రిగల యచ్చులతో యతి మైత్రి పాటింపవచ్చును. లేక, వట్రువ సుడిలోనున్న యే వ్యంజనమైనను మిత్రముగ నెంచ నగును. ఏలనన, నది వట్రువలో డిగ్గిన హల్లు కాను లేవిధానిగ నుండును. కేవల మచ్చు గ్రహింపఁబడుటచే నిందు పరిగణించుట యుచితము. 'ఇందు' అనఁగా గ్రహణ న్యాసమునందు నని భావము.

ఉదాహరణము:- (హ కారమునకు) అచ్చును గ్రహించుట న్యాసము.
"అతని కన్నులారఁగ సహర్నిశముం గనుఁగొంచు నుండు నా"
భారతము-ఉద్యోగ పర్వము-2 ఆ - 380 పద్యము.

అంతే "వి। ఖ్యాతు పవిత్రమూర్తి శరణాగత రక్షకు నాశ్ర యించెదన్"

ఇందు య కారము అ రూపతంజె ది గ్రహింపఁబడినది. తనతోడి ప్రాణముచేతనే తాను రూపితమైనది. సంయుక్తము కాని 'యా' కు లక్ష్యము.

నెమ్మిమై। నుండఁగ దుష్టచేష్టల సుయోధను డింతలు సేసె-
భార - ఉద్యో - 3 - 47. 'ఉండఁగ'-ఉకారమును గ్రహించి 'సుయోధను' లోని యుకారము విన్యాసమున నచ్చుతో నభేదము.

ఋ కారమునకు-

'కృష్ణు దర్శింపకున్న నా క్రేమి చిక్కు':- జైమినిభార-3-109.
ఇందు క కారము వట్టువతో నభేదమును చెందినది.
'పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ'. విష్ణుచిత్తీ-1-141.

ఇందు గ్రహణ విన్యాసములందు రెండింటను హల్లు ఋ కారముతో నభిన్నమై యొప్పినది.

చేరియుది, హరియించు, మొదలగువాని యందలి య కారము అ భావతుల్యమగుటచే వానియందలి స్వరము గ్రహింపఁబడుచు యతి యుం దొప్పును. చేరిదియును సంధి రూపమున వృత్తి యందు పరవదాది యచ్చు లోపించినది. అట్టిదానికి యతియందు గ్రహణ విన్యాసములను అప్పకవి నిషేధించినాఁడు. విసర్గ సంధియందగు గూఢస్వరమునకు మాత్రమే గ్రహణ మిచ్చుట విధించుటచే తద్భిన్నములగు గుప్తగూఢ స్వరములకు గ్రహణ విన్యాసములు నిషిద్ధములగుచున్నవి. ధరించు, హరించు, మొదలగు సంధులందు 'ఇంచు' అనునది ప్రత్యయము. కాన

అఖండవడి యందుఁ జెప్పఁబోవు తీరుల ననుసరించి యచ్చునకు హల్లు నకుఁగూడ గ్రహణము సిద్ధింపఁగలదు.

## సూత్రము 6 :- ఒకచో గాఢ బంధంబు నందగు పరాచ్చు పూర్వ వ్యంజనముతోడను గ్రహింపఁబడు.

అచ్సంధియందు పరపదాదియందగు నచ్చు గ్రహింపఁబడునని పూర్వము విధింపఁబడినది. ఒకచో సంధి గాఢ బంధముచే నొప్పును. అట్లు సంధి గావింపఁబడిన పదము లొక్కపదమేయను నంతట గాఢమైన సంధికలవియై సంధి తెలియనంతగ బంధితములై యుండును. అట్టి సంధి యున్న పదములందు మాత్రము హల్లుకుఁగూడ పరపదాచ్చుతో గ్రహింపవలెనని భావము. దీనినే 'అఖండయతి' యని యందురు. అది వైకల్పిక మనుటను క్వాచిత్కమనుటను 'నొకచో' యను పదము తెలుపును. అచ్చును గ్రహించుట యెపుడును సిద్ధమే. ఇది వ్యంజన గ్రహణమునుగూడ తెలుపుచున్నది. ఏకపదమను నంతట దృఢబంధ[illegible] మాత్రమే పూర్వ వ్యంజనమును గ్రహింపవగునని లాక్షణికు లందరును తలఁచిరి. అట్టి బంధముగల పదములను నిరూపించుటలో మతభేదము లున్నవి. కాని 'అఖండయతి' నందరు నంగీకరించియున్నారు. అచ్చు వేరుగ ఖండమైయున్నను నఖండముగ భావించి పూర్వవ్యంజనమును గ్రహించుటచే నీ పేరు కలిగినది సులభముగ గ్రహించుట కట్టి పదములను జూపుచున్నాను.

వీనిలోఁ బూర్వవ్యంజనంబును గ్రాహ్యంబగును.

(1) యుష్మ దస్మ చ్ఛబ్దంబు లజాదులతో నతుకు నపుడు—

ఉదా॥ యుష్మదాజ్ఞ, అస్మదాదులు.

(2) పరరూపము వచ్చిన శకంధ్వాది గణము నందలి పదముల లోను (ఇది యాకృతి గణము.)

శ్లో॥ శకంధు రథ కర్కంధూః కుద్దాలో లక్త పర్కటీ
లాంగలీషా హాలీషాచ మనీషాచ పతంజలిః।
కుల్కోలోష్ఠీవ మంజీర మస్తిష్క కులటాదయః
లిఘావృకంధు సీమంతౌ శకంధ్వాది గణేస్మృతాః।

(3) ధాతూపసర్గల సంధియందును - ప్ర + ఆప్తి = ప్రాప్తి; పర + ఆక్రమ = పరాక్రమ - అవ్యయ

(4) నిత్య సమాస సంధులందును; - విగ్రహ వాక్యము లేని - లేక - స్వపదములతో విగ్రహము లేని సమాసము నిత్య సమాసము -

కర్ణాట, ద్వీప, నాస్తి, అశోక, జనార్దన, వనౌక, అంతరీప, పదార్థ, అన్యోన్య, నాక, మందార, నారికేళ, అపోకస్త, స్వాంత, ఏకాన్త, సిద్ధాన్త, రాద్ధాంత, ప్రాంత, నిశాన్త, నారాయణ, వాతాయన, రసాయన, రామాయణ, బాదరాయణ, కాత్యాయన, బోధాయన-

ఇట్లే పృషోదరాది గణమందగు ద్వారాది శబ్దంబులును, అని తెలియవలయును. (ఇక సమాసము నందగునవియు,) పరోక్షాది నిపాత లందగు పదములను గ్రహింపనగును.

(5) శబ్దపల్లవములందును:- వీనినే దేశ్య నిత్య సమాసములందురు - రూపఱు, పెంపఱు, వీవఱచుట, క్రిక్కిఱియుట, క్రచ్చఱ, చూపఱు, ఉక్కఱు, పెల్లఱ మొదలగునవి.

(6) అపదాది స్వరసంధు లందును — ఏసి, ఎడు, మొదలగు సర్థ భేదము లందగునవి యతులు నపుడును. త్వార్థేకారము ఇనన్ మొ॥

(7) అన్నాదు లతులు నపుడును - అన్న, అన్నా, అది- మొదలగునవి యతులు నవియు

(8) కన్న, కంటె, మొదలగు సంధులందును.

(9) కాకు, ప్లుతాదులందును - అది శబ్దముచే సంప్రశ్నార్థకాదు లగు అ, ఈ, ఏ, ఓ, మొదలగునవియు గ్రహింపనగును.

(10) కృత్తద్ధిత వృత్తులందును-

కలిమి, కూరిమి, వ్రేలిమి, అమరిక, ఓపిక, పోలిక, కోరిక, పూనిక, ఎండ, మాఱకము, అద్దకము, అంటు, ఒఱుగు, ఒసగు, మొదలగునవి కృదంతములు. (అంతరంగ సంధి నంటివిని)

అరి, అఁడు, ఈఁడు, ఇది, మొదలగునవి తద్ధిత ప్రత్యయములు అవి యంతమందు గల పదంబులు తద్ధితాంతములు.

(11) వృత్తియందగు 'ఆలు' పదం బరికిన పదంబులును, జవరాలు, ముద్దరాలు పూజ్యురాలు, మొదలగునవి.

ఇందపదాది స్వరసంధిచే గతార్థములైనవానికిఁ బ్రత్యేకముగఁ బరిగణన స్పష్ట ప్రతిపత్తి కగుచున్నది ఇట్లై ఉన్న, ఎడి, ఎములును, అన్యోన్య శబ్దమునందు గుణముచేనైన 'ఓ' కారమును గ్రహించి యతిఁ గూర్చుట కానరాదు. ఇట్లు ప్రత్యేకముగ గుణాక్షరములకు గ్రహణము కానరాకుండుటచే నప్పకవి గూఢమగు నకారమును గ్రహించి సవర్ణ న్యాసమును తెలుపక 'ఓ' కారమునకే అ, యు, వాలు యతిం జెందు ననినాఁడు. అతని పక్షమున నకార గ్రహణము లేదు. అచట అచ్చు 'ఓ' కారమని యతని భావము. ఇట్టిది మఱియొక యుదాహరణము గుణసంధియందైనది కానరాదు. 'అపోకనము' పృషోదరాది గుణపతితము. కాన నచట గుణమని భావింపరాదు. ఓకి కేవలము గ్రహణము కాదు.

ఉపాయన, పరాయణ, శబ్దము లుపసర్గ సంధులయ్యును సమాసత్వముచే నిత్య సమాసములం దప్పకవి గ్రహించినాఁడు. ద్వీప, అంతరీపాదులందు పరస్వర మకారమే యయ్యును నాదేశమగు 'ఈ' కారమునకే లక్ష్యములు కాననగును

విశ్వామిత్ర శబ్దమునందలి 'ఆ' కారము కుమారాయితలోని 'ఆ' వంటిదే వ్యాకరణ సిద్ధము అప్పకవి యేలనో యచట 'అ'కారము గ్రహించినాడు. ప్రయోగ మర్థభేదముచే సమర్థింపనగును. అక్కడ

ఋషివాచకముకాక నిందార్థక మనవచ్చును. లేదా, ప్రామాదిక మన నగును. అంతమాత్రమున కావ్యత్వహాని లేదుగదా! లేదా విశ్వా! మిత్ర ఏవ విశ్వామిత్రః అని తత్త్వాధ్యారోపము చేయవచ్చును.

ఇట్టివి మఱికొన్ని గలవు.

(1) ఉ, వు, లకు యతిఁగూర్చుట.

(2) 'స్నాన' శబ్దమునకు వికృతి 'తానము' కాన వికృతి సాహచర్యముచే 'త' కారమును గూర్చుట.

(3) ఋ, రు, లకు యతిఁగూర్చుట యని తెలియునది.

ఉపసర్గలు ధాతువుతోఁ గలిసి 'మిథునము' అను సంజ్ఞ యందును. అట్టి సంజ్ఞ వృషభాధిప, వసుధాధిప, యనునవు డేర్పడు-వృషభ + అధిప; వసుధా + అధిప; అను సంధులలో రాదు. 'అధిప' యనునది మిథునము. దానిలోఁ బూర్వపదము సమసించినది అయినను నిక్కడ 'అధిప'యను పదము తెనుఁగున 'అన్న' 'అమ్మ' యను పదములవలె భిన్నార్థకము. కాన నిచట లక్ష్యములగుచున్నవి. పై వివరణములు గమనించిన అచ్ఛంధియందును గాఢబంధమున్నచోఁ బూర్వ వ్యంజనము గ్రహింప నగునని భావము. వివరణము గాఢ బంధత్వ ద్యోతకము కాని, ప్రభేద కారకముగాదని భావము. బంధమందలి గాఢత్వము సహృదయైక వేద్యముగాని దానిని నిర్వచించుట ప్రపంచార్థము.

ఇందులకు లక్ష్యములు:-

యుష్మదస్మదులకు,

'ధర్మతనయ! యుష్మదాజ్ఞానిగళ - అధర్వ - భార - విరాట - ఇంతు వ్యంజనము న్యస్తము.

'త్రస్తాత్మలమైన యస్మదాదుల కెల్ల-ఆదిపర్వ-8అ-289 పద్య అస్మల్‌లోని వ్యంజనము న్యస్తము.

ఇట్లే, తల్, ఏతల్, భవల్, మొదలగునవి యగును.

శకంధ్వాది గణమున కుదాహరణము.

వే॥ దండ దండ విదారి ఘోర తరాసి భాసి భుజార్గళా - భార తము - ఆదిపర్వము - 3ఆ - 228 పద్యము.

ఇంద మ్ము గ్రహింపఁబడినది.

వే॥ దండ ముఖాంగముల్ తృణ వితానముగాఁగొని నిర్వికారుఁడై భారతము - భీష్మపర్వము - 1ఆ - 231 పద్యము.

ఇందు వ్యంజనము గ్రహింపఁబడినది.

ఉపసర్గ సంధిలోని యుదాహరణము.

మానవుఁడు పఠించినను సమాహిత మతియై - భారత - అను శాస - 5ఆ - 401 పద్య ఇందు వ్యంజనము న్యస్తము.

అచ్చునకు - భారతము - అనుశాస - 5ఆ - 417 పద్యము.

అగమోక్త విధంబుఁ బ్రత్యక్షమును స

మా చరణముఁ బృథగ్విధ వ్యాకులములు.

నిత్య సమాసముల కుదాహరణము—

నఙ్ సమాసమునకు - భారత - ఉద్యోగ - 2ఆ - 295 పద్యము.

అర్ణవ వేష్టిత క్షితి యునర్గళ విక్రమమొప్ప దక్కుమా.

అచ్చునకు విన్యాసము.

ద్విపశబ్దమునకు శృంగార నైషధము - 1ఆ - 44 పద్యము.

వితత నవద్వయు ద్విప నానాజయ.

శ్రీవధూటీ సమాశ్లిష్టభుజుఁడు :- ద్విప వ్యంజన మైత్రి.

ఉదాహరణము:- (శబ్దపల్లవములందు) - భార - అరణ్య - 6ఆ- 345 పద్యము.

జలధరము క్రియను

క్కుఱఁ దద్వనమెల్ల నడుమ నార్చుచుఁ గడిమిఁ-

ఇందు స్వరమునకు గ్రహణము.

ఉదాహరణము:- (అపదాదిస్వర సంధియందు)

తెలిసి కుచేలుఁడొక్క కొణిదెండటుకుల్ దనకిచ్చినన్.

ఇందు వ్యంజనమునకు విన్యాసము.

సంబోధనంబందగు ప్లుతాచ్చునకు-

ఆహా! యేమని దూరు దాన నిను నాథా! వేఁగు జామయ్యె.

కళాపూర్ణో - 4ఆ - 112 పద్యము

అన్నాది పద సంయోగమునకు:-

నరసిం। గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్

ఇందు వ్యంజనమునకు న్యాసము.

ఇట్లే తక్కుంగల వూహించునది.

అన్న శబ్దమునకు జ్యేష్ఠుడను నర్థమిచ్చుట లేదు.

ఇది గ్రహణ విన్యాస నిరూపణంబను రెండవ యంశము.

-: సంపూర్ణము :-

## సవర్ణ నిరూపణంబను మూఁడవ యంశము

### సూత్రము 7 :- తుల్యాస్య ప్రయత్నంబులగు వర్ణంబులు సవర్ణంబులు.

అభ్యంతర ప్రయత్నము మాత్రమే గ్రహింపఁబడుచున్నది. ఉత్పత్తి స్థానంబును, ప్రయత్నంబును, తుల్యములగు వర్ణంబులు సవర్ణంబులు. అచ్చులకు హల్లులకును నీ సావర్ణ్యముచెల్లదు. అచ్చుల కచ్చులే సవర్ణంబులు. హల్లులకవియే సవర్ణంబులు.

ఋ, ౡ, వర్ణంబులకు వార్తికంబుచే సావర్ణ్యము సిద్ధంబు. చ ఛ జ ఙ లగు సవర్ణత్వమును ఆంధ్రవ్యాకరణ సమ్మతము.

సవర్ణంబులను పదము తరువాతి సూత్రములకు ననువర్తించును. ఇందు నిరూపింపఁబడినవి సహజ సవర్ణంబులు.

తరువాతి సూత్రములందు వివరింపఁబడినవి సిద్ధ సవర్ణంబులు. సహజసిద్ధ సవర్ణంబుల నీ తీరున నెఱుంగునది.

**-: సహజ సవర్ణంబులు :-**

| అచ్చులు | హల్లులు |
|---|---|
| అ, ఆ, | క ఖ గ ఘ |
| ఇ, ఈ, | చ ఛ జ ఝ |
| ఉ, ఊ, | ట ఠ డ ఢ |
| ఋ, ౠ, ఌ, ౡ. | త థ ద ధ |
| | ప ఫ బ భ |

స్థానభేదముండుటచే నంతస్థములకు, నూష్మములకు, సహజ సావర్ణ్యత్వములేదు. లాఘవము లేకున్నను సహజత్వ నిరూపణంబునకు భేదము పరిగణింపఁబడినది.

సహజ సవర్ణంబుల కుదాహరణములు :-

'ఇట్లు శత్రుంతపునిఁద్రుంచి యివ్విధమున' - భారత - విరాట - 5 అశ్వా - 78 పద్యము. పాదాది 'ఇ' కారమునకు గ్రహణము. 'యివ్వి ధమున' అను పదములో 'యి' విన్యస్తము. 'య' కారము స్వప్రాణ తుల్య మగుటను 'య' అను వ్యంజనము నందలి 'ఇ' కారములో కి సావర్ణ్యము సిద్ధము.

'అపుడు రాధేయుఁ డిమ్మొయి ననజు పాటు' - విరాట - 5 అ - 81 ప. అకారమును గ్రహించి 'అనుజ'లోని 'అ' కారమునకు న్యాసము. ఏ అక్షరమునకది సవర్ణమగుట సహజమే యగును. దాని కుదాహరణము.

'విఱువంగానేసె నరుఁడు విక్రమ లీలన్'

'వి' కి గ్రహణ న్యాసము లమరినవి.

'దప్పక భానుసూను మెయి దాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్' భారత - విరాట - 5 అ - 98 పద్యము.

'దప్పక' లోని 'ద్' అను వ్యంజనమునకు 'అ' కారమును సచ్చు నకును గ్రహణము. 'దాఁకఁగ' అను పదములోని 'ద్' అను వ్యంజనము 'ఆ' అను స్వరమును సవర్ణములు. కాన, న్యాసమందయునవి.

ఆదేశ 'గ' కారమునకు, భారత-అశ్వమే - 4 అ - 256 పద్యము '...............వేదిఁ

'గల్పించి తగ వగ్ని కార్యంబు నడపంగ' - 'గ' ఆదేశరూపము 'కా' న్యాసము సంస్థైనది

ఉదాహరణము :- 'వ'కు 'బ'యతి. అశ్వమేధ-4అ-220పద్యము.

'వహ్నియు సహచర భావంబు నొందిన'

ఇట్లు తక్కిన వూహించునది.

సిద్ధంబు లనగా వికృతియందగు మార్పుల ననుసరించి - సవర్ణము వలె వినికిడి కలిగియు నితరంబులగు భాషాపరిణామ క్రమంబులనందియు సవర్ణత్వంబు సిద్ధించినవి. అట్టివానికి లక్షణంబులు వివరింపఁబడును.

సూత్రము 8 :- 'ఐ, ఔ'లు అ 'ఆ' తుల్యంబులు.

'ఆ' అను నక్షరమునకు సమానము లనుటచే వానికి సవర్ణత్వంబు 'ఆ' తోడను, తమ లోపలనుగూడ సిద్ధమైనది. దానిననుసరించి 'అ'అను హ్రస్వంబుతోడను, ప్లుతంబుతోడను సవర్ణత్వంబు సిద్ధించినది 'సవర్ణము' లను పదమును వృత్తమైనది. 'ఐ, ఔ' లు 'ఆ' కు తుల్యంబులగుటను సవర్ణంబులైనవి. తరువాతి సూత్రములకుఁ దుల్యంబులనునదియు, సవర్ణంబు లనునదియు ననువర్తించుచుండును.

'కౌరవసైన్య మేకాదశా క్షౌహిణీ' - అశ్వమేధ-3ఆ - 122 ప.

ఇందు 'కౌ' నందగు 'ఔ' కారమునకు 'కా'[redacted]దలి 'ఆ' కారమునకు యతి చెందినది. ఇది వ్యంజన సహితము.

సూత్రము 9 :- 'ఇ' కారమునకు 'ఋ. ౠ, ఎ, ఏ'లు :-

(ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ). ఇట్లనుటచే 'ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ' లు సవర్ణంబులైనవి. సహజసిద్ధ సవర్ణములను నిరూపించుటలో గురుత్వమను దోషమున్నది. అట్లయ్యును సహజత్వము దెలియుటకై భేద గణనము సేయఁబడినదని వివరింపఁబడియే యున్నది.

సూత్రము 10 :- ఒ, ఓ. ఉ, ఊ లును (ఒ, ఓ, లు; ఊ) తుల్యంబు లగుటను సవర్ణంబులు.

సూత్రము 11 :- కేవల ఋ వర్ణాపేక్షితంబు రేఫంబు స్వస్వర రూపంబువగు

'ఋ' వర్ణమాత్రమున కనుటచే దాని సవర్ణంబులకుఁ బరిగణన లేదు. రేఫము వ్యంజనత్వమును విడిచి దానియందగు స్వరముతో మైత్రి నందునని భావము.

ఉదా॥ 'ఋత్విజుండని విచారించి పూజించితే'– ఋకారమును గ్రహించి రేఫను లేనిదానిగ భావించి దానియందగు ఇ కారము యతిగ నిరూపింపఁబడినది. ఇట్టిది వివక్షయందగును.

సూత్రము 12 :- బిందుపూర్వక వర్గాక్షరములు స్వస్వపంచమంబులకు:- ంక, ంఖ, ంగ, ంఘ, ఙ, అనునవి సవర్ణంబులు.

అచ్చులును హానియందగునవి సవర్ణంబులు కావలయును.

ఇట్లే, చ, ట, త, ప, వర్ణంబులకు నెఱుంగునది.

'నందనోద్దామ మందారక చ్ఛాయల' నై షధము.

న కారమునకు 'ందా' యతి మైత్రి.

సూత్రము 13 :- న, ణ, లు :- న, ణ. లు తుల్యంబులు కాన సవర్ణంబులు.

ఇట్లనుటచే న, ణ, లకు బిందుపూర్వకములగు త, ట, వర్గంబులును సవర్ణంబులగుచున్నవి.

ఉదా:- '......... ... పెక్కు చం

దాలం బండు నొకవ్వడుం దఱుగ దింటర్ వాడియుర్ బంట

యుర్' మనుచరిత్రము – 'ందా' అనుదానికి గ్రహణము – బిందుపూర్వక

ట' యతిమైత్రి.

సూత్రము 14 :- కేవల 'జ్ఞ 'కు న, ణ. లును, క, ఖ, గ, ఘ,లును కేవలమనుటచే న, ణ, క, ఖ, గ, ఘ, లకు నవ

ర్ణంబులును, 'జ్ఞ'కు సవర్ణంబులును గ్రహింపఁ బడవు. క వర్గంబు, వ. ణ, లకును మిత్రంబులు గావు.

ఉదా॥ శాన్తిపర్వము. 4 ఆ - 255 పద్యము.

'జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము సేయఁగా'

కొందఱిచ్చోఁ బాఠాంతరముం జూచి క, ఖ, గ, ఘ,లు 'జ్ఞ' వర్గంబునకు మిత్రంబులు కావందురు. కాని, కవులు వాడిరి

'కర్మమధర్మ మజ్ఞాన మాగడము' పండితారాధ్య చరిత్ర

'జ్ఞానేంద్రియ జ్ఞాన కళలారు సొరుగా'-కాశీఖం-1ఆ-139 ప.

ఉదాహరణము:- ('న'కు)

'.............. సత్యభారతీ

జ్ఞానులు పద్మగర్భ వదనంబులు నాలుగు బోలె వాణిలోన.

సూత్రము 15 :- కేవల 'ము' నకు. అచ్చుమైత్రిగల ప, ఫ, బ, భ, లు.

ఉదా॥ భారతము - ఆదిపర్వము - 5ఆ - 58 పద్యము.

'పుట్టిన సదసద్వివేకములు గలిగినఁ డా'

'ముందు మీరెఱిఁగిన భూతలాధీశు' - హరిశ్చంద్ర

'పోఁక బ్రమాఁకుల సొంపు ముసుపు కొనఁగ'-కాశీఖండము.

సూత్రము 16 :- కేవల 'మ' కారమునకు బిందుపూర్వక యంతస్థములును. ఊష్మములును:-

అచ్చుమైత్రి గలిగిన బిందుపూర్వమందున్న య, ర, ల, వ, శ, ష, స, హ, లు, మకార తుల్యంబులై సవర్ణంబులగును. కేవల మగుటచే 'మ' వర్గ సవర్ణంబులకివి సవర్ణంబులు గావు.

భీమన చాటుధార-

'........... కం

హరణ గుణాభిరాముఁడగు మైలమ భీమన ఖడ్గ సృష్టికిన్'

'ంహ' కు గ్రహణము. 'మై' న్యాసము.

సూత్రము 17 :- శ, ష, స, ఛ, ఛ, జ, ఝ, లు-

ఇవి పరస్పర తుల్యములు గాన సవర్ణంబులు.

'సపరివారముగాగ నాశ్చర్యపూర' భారతము-ఆను - శాసనిక-

శిల - 284 పద్యము.

సూత్రము 18 :- రలాదుల కభేదంబు సిద్ధంబు గ్రాహ్యంబు.

'రలయో ర్లడయో స్తద్వ ల్లళయో శసయోరపి

వబయోశ్న యోశ్చాంతే......స్యాదభేదేవ కల్పనమ్'

'అను సూక్తి యా[redacted] వభేద యతిని కల్పించెదరు.

అట్టియెడ తేఁ యక్షర మున్నదో తెలుప శక్యముగాదు. కాన, దీనికిఁ బ్రత్యేక గణనము లేదు. సదృశరూపమున్నట్లే భావింపవచ్చును. ర, ఱ, లకు సవర్ణప్రాప్తి లేదు. ఉచ్చారణభేదము లేదన్న వారి మతమున సవర్ణత్వము సహజము. తెనుగు పదములందభేదము రలాదులకు వాడిన విశేషంబులు ప్రయోగఁబుల తెలుఁగునది. అట్టివాని కభేదయతియని గ్రహింపవలెను.

ఉదా:- బంగరు దప్పటంబువలె వాటుగనొప్ప హసన్ముఖాబ్జుఁడై

ఇందు బంగరువలె బాటువదములు అచ్చతెనుగువదములు. ఇందు ఛ, వ లకు యతికూర్పబడినది. ఇట్టి ప్రయోగ విశేషములచే వభేద యతి సార్థకమగుచున్నది. యతి విషయమున మాత్రము సంస్కృత

సాజాత్యముచే నిది సిద్ధము. ద్రవిడభాషలందు నిట్టి యభేదము కొన్నిటఁ గలదు. నదియు దీనికి హేతువగుచున్నది. ఇట్లే ప్రాసయందును గాన నగును.

### సవర్ణ నిరూపణంబను మూఁడవ యంశంబు

-: సమాప్తము :-



## ప్రాస నిరూపణంబను నాల్గవ యంశము

సూత్రము 19 :- పాదాది యచ్చునకు రెండవ యచ్చునకు మధ్య నుండు వర్ణసముదాయము ప్రాసనాఁబడును. ఇట్లనుటచే పాలభావప్రాస సిద్ధంబు

బిందువును హల్లును నిందుఁ జేరుచున్నవి. అచ్చులకు గ్రహణము లేదు. హల్లులెన్నియున్న నన్నింటికిని గ్రహణము.

సూత్రము 20 :- పద్యపాదంబులన్నింటఁ బ్రాసవర్ణంబులు తుల్యంబులును దత్పూర్వాక్షరంబులు గురు లఘువులలో నొక్కటిగ తుల్యమగుటయు నియతంబు.

ఉదా॥ భారతము-అనుశాసనిక-5అ-188 పద్యము.

శాశ్వతములైన పురుష
స్త్రీత్వంబులు లేవు పార్వతీ జీవున కా
త్మత్వంబున కహంకృతి గ
ల్గిత్వములని భావ్యవిధము మెయిఁగొనుచుందుర్.

ఇందు పాదాది యచ్చు 'శా' లోని ఆకారము; రెండవ యచ్చు 'శ్వ' లోని అకారము; ఈ రెంటికి మధ్యను 'శ్, వ్' యను రెండు వ్యంజనంబులు గలవు ఇవి పద్యంబున నాల్గు పాదంబులందును సమానంబుగ నున్నవి అచ్చులు భిన్నములైనను గావచ్చును. ప్రాసకుఁ బూర్వాక్షరము మొదటిపాదమున గురువైనది. కాన, నన్నిపాదంబులందును గురువు కావలెను. అట్లే యున్నది. ప్రాస యుండఁదగిన పద్యంబులు ఛందస్సువలన తెలియఁబడును. మాలికలందు నాల్గుపాదములకే కాక నన్నింటఁ బ్రాస సమానము. ద్విపదకు రెండు పాదములకే ప్రాస నియతము.

ఋ వర్ణ మచ్చగుటచే దానిని వేఱుగఁ దెలుపనైతిని.

సూత్రము 21 :- ఖండ బిందు వ బిందుకములతోడను, పూర్ణంబు తోడను ప్రాసమైత్రి నెనయు

రెండును నొక్కటంగాదు. ఖండబిందువు బిందువులేని పదంబులలోనుండి ప్రాసయందుఁ గానగును. అట్లే ఖండము పూర్ణబిందువున్న పదంబులతోడను ప్రాసమైత్రి నెనయును. కాని బిందువులేనిది, ఖండమున్నది. పూర్ణబిందు వున్నదియునగు పదములొక్క పద్యమునఁ బ్రాసమైత్రి నెనయవు

సూత్రము 22 :- ర, ల, సంయుతంబు లసంయుతంబుల నెనయు

ర, ల, సంయుతంబులగు పదంబు లవి లేనివానితోఁ బ్రాసమైత్రి నెనయునని భావము.

'సంభ్రమంబున కుంభ నికుంభ దైత్య'

ఇచట రేఫతోఁగూడిన 'ంభ్ర' యను ప్రాసాక్షరములు 'ంభ' యను వానితోఁ బ్రాసమైత్రిని నెనసినవి ఇట్లుదహరించుటచేతఁ బ్రాస లేని పద్యంబులందు ప్రాసమైత్రియుండవగునని తెలియునది

సూత్రము 23 :- ఆదేశ 'ష' ణ' లు క్రమముగ 'స, న'ల నెనయు

సంస్కృత పదంబులందు స కారమునకు ష-యాదేశమగును;

అట్లే 'న' కు 'ణ' యాదేశమగును; అట్టివి; ష-సకును; ణ-న కును; ప్రాసమైత్రి నెనయును. ఉదా॥

ప్రాణ వల్లభుఁ గాని చన్న దాన వేంద్ర:- 'ణ'కు 'న' ప్రాస॥

సూత్రము 24 :- బిందుపూర్వక 'న, మ'లు క్రమంబున 'న్న, మ్మ' లతో నెనయు

ంన,-న్న తోడను; ంమ-మ్మ తోడను ప్రాసమైత్రి నెనయును స్పష్టము.

సూత్రము 25 - 'మ్ము' వర్ణంబు, 'ంబు' వర్ణంబు నెనయు.

'మ్ము, ంబు' లు ప్రాసమైత్రి నెనయును

'కమ్మతావుల వెదజల్లు నంబుజంబు' - ప్రాసమైత్రి యతియందు జూపినాఁడు.

సూత్రము 26 .- 'థ ధ' లును, నట్లే 'ద, ధ' లును మైత్రినెనయు

థ-ధ కారము తోడను; ద-ధ కారంబు తోడను ప్రాసమైత్రి నెనయునని భావము విరాటపర్వ-1ఆ-30 వ. ద-ధప్రాసకలదు 'సుదేష్ణ' అని కారమును తిక్కన వాడిన నీ ప్రాస యనవసరము.

రేఫంబుతో నెనయు ప్రసిద్ధంబులగు రూప భేదంబులందగు ల డ'లు ప్రాసంబెందును కాని, యందు రూపభేదంబున్నది గాన గణన యనవసరము. గకడదవా ద్యాదేశాక్షరంబులు స్వరూపంబు తోడన ప్రాసంబెందును విశేషములు యతియందువలె గ్రాహ్యంబులు గొందఱు [illegible] ప్రాసము నంగీకరింపరు.

(విరాటపర్వము 1ఆ-301)

వచోరా

స్పదమగు నెలవున మెలగెను

సుధేష్ణత జ్ఞాలకములఁ జూచెన్ ప్రీతిన్

ఇందు దధ ప్రాస కలదు ఇక్కడ సుదేష్ణ అని నవీనప్రతులందు కలదు.

త వర్గ తృతీయవర్గమేయున్న తిక్కనగారి సమ్మతి దీనికి లేదు. కాన దధ ప్రాస అంగీకరింపబడదనియు నందురు

(విరాటపర్వము 1ఆ-303-పద్యము)

గ్రంధి విభేదనా పరమ కారుణికా

పరిమాణ దూర దుః

ఖేంధన పావకాయిత సమీక్షణ చైత్య
మహోద్భుతాత్మకా!

ఇందు థ ధ ప్రాసము కలదు తక్కినవిట్లే యూహ్యంబు

ఇట్లు ప్రాసనిరూపణంబను నాల్గవ అంశంబు ముగిసినది

ఇరువదియారు సూత్రంబులతో వళి, ప్రాస సంగ్రహం గ్రంథము సంపూర్ణంబు.

ఇది వాసిష్ఠ అయల సోమయాజుల నరసింహశర్మ రచిత వళి ప్రాస సంగ్రహంబను గ్రంథంబు సర్వంబు సంపూర్ణంబు.